# ఇంద్రధనుస్సు

(శ్రీ మండలి వెంకట కృష్ణారావు)




రచన

శతాధిక గ్రంథకర్త - కవి వాచస్పతి

దైవజ్ఞ **బ్రహ్మశ్రీ తేజోమూర్తుల వేంకటేశ్వరరావు**

ఎం.ఏ. (తెలుగు), ఎం.ఏ. (జ్యోతిషం) బి.ఇడి

విశ్రాంత ఆంధ్ర పండితుడు



# ఇంద్రధనుస్సు

(శ్రీ మండలి వెంకట కృష్ణారావు)


*రచన:*

శతాధిక గ్రంథకర్త - కవి వాచస్పతి

దైవజ్ఞ **బ్రహ్మశ్రీ తేజోమూర్తుల వేంకటేశ్వరరావు**

*ఎం.ఏ. (తెలుగు), ఎం.ఏ. (జ్యోతిషం) బి.ఇడి*

విశ్రాంత ఆంధ్ర పండితుఁడు

పాయకరావుపేట, విశాఖపట్నం జిల్లా, ఆంధ్రప్రదేశ్

ఫోన్: 94919 00145, 95159 13828

**ఇంద్రధనుస్సు**
(శ్రీ మండలి వెంకట కృష్ణారావు)

**INDRADHANUSSU**
(Sri Mandali Venkata Krishna Rao)

*రచన :*
దైవజ్ఞ **బ్రహ్మశ్రీ తేజోమూర్తుల వెంకటేశ్వరరావు**

---

*ప్రథమ ముద్రణ:*
ఆగస్టు, 2022

*ప్రచురణ:*
**మండలి ఫౌండేషన్**
గాంధీక్షేత్రం, అవనిగడ్డ - 521 121
కృష్ణాజిల్లా, ఆంధ్రప్రదేశ్.

*ముద్రణ:*
**సాయిలిఖిత ప్రింటర్స్**
ఖైరతాబాద్, హైదరాబాద్ - 500 004.
ఫోన్: 7207045979

**మండలి బుద్ధప్రసాద్**
మాజి ఉపసభాపతి, మాజీ మంత్రి
ఆంధ్రప్రదేశ్

**Dr. Mandali Buddha Prasad**
*Former Deputy Speaker &*
*Former Minister, Andhra Pradesh*

Ph. Off. : 08671-272056
Cell : 98487 80872
గాంధీ క్షేత్రం,
అవనిగడ్డ-521 121, కృష్ణా జిల్లా
Gandhi Kshetram
Avanigadda - 521 121
Krishna Distict

తేది: 04-08-2023

# మా మాట

దైవజ్ఞ బ్రహ్మశ్రీ తేజోమూర్తుల వేంకటేశ్వరరావు గారు మా నాన్నగారు మండలి వెంకటకృష్ణారావు గారి జీవిత చరిత్రను ఎంతో శ్రమకోర్చి పద్యకావ్యంగా వెలయించినందుకు వారికి నా హృదయపూర్వక ధన్యవాదాలు.

తెలుగులో పద్యకావ్యాలుగా వచ్చిన జీవిత చరిత్రలు బహు స్వల్పం. వాటిలో తెలుగలెంకగా సుప్రసిద్ధులైన తుమ్మల సీతారామమూర్తి గారు రచించిన మహాత్మాగాంధీ జీవితచరిత్ర బాగా ప్రాచుర్యంలోకి వచ్చింది. తేజోమూర్తుల వేంకటేశ్వరరావు గారు బహుముఖ ప్రజ్ఞాశాలి. అధ్యాపక వృత్తిలో కొనసాగుతూనే శతాధిక గ్రంథాలు రచించారు. వీరి రచనలలో శతకాలు, సుప్రభాతాలు, పద్యకృతులు, వచన రచనలు, నాటకాలు, నాటికలు బహు సంఖ్యలో ఉన్నాయి. దానితో పాటు నటనారంగంలో కూడా వైదుష్యం గలవారాయన.

మా నాన్నగారు 1926 ఆగస్టు 4వ తేదీన జన్మించారు. 1997 సెప్టెంబర్ 27వ తేదీన పరమదించారు. వారు పరలోక వాసులై ఇప్పటికి 26 సంవత్సరాలు గతించాయి. అయినప్పటికీ వారిని గుర్తుపెట్టుకుని, ఎంతో ఆప్యాయంగా వారి జీవితచరిత్రను పద్యకావ్యంగా రచించడాన్ని బట్టి వారిపై వేంకటేశ్వరరావుగారికి ఎంతటి అభిమానం ఉన్నదో అవగతమవుతున్నది.

విశ్వనాథ సత్యనారాయణ గారు తమ రామాయణ కల్పవృక్షం అవతారికలో "సుస్థిరమగు కావ్యమందు కవిచే నిలుపంబడు వాని పేరు, సుస్థిరముగ నేల సౌఖ్యము భజించడు వేల్పుల వీడు నందునన్" అని పేర్కొన్నారు. మా నాన్నగారి గురించి ఒక ఉత్తమమైన పద్యకావ్యాన్ని వెలయించి, ఆయనకు భువిలోనూ, దివిలోనూ శాశ్వతత్వాన్ని చేకూర్చినందుకు బ్రహ్మశ్రీ తేజోమూర్తుల వేంకటేశ్వరరావు గారికి మండలి ఫౌండేషన్ పక్షాన ధన్యవాదాలు తెలయిజేస్తున్నాను.

**(మండలి బుద్ధప్రసాద్)**
అధ్యక్షులు, మండలి ఫౌండేషన్
గాంధీ క్షేత్రం, అవనిగడ్డ

# నిరంతర సాహితీ తపస్వి 'తేజోమూర్తుల'

**- గుమ్మా సాంబశివరావు**
విశ్రాంత ఆంధ్రోపన్యాసకుడు
9849265025

శ్రీ తేజోమూర్తుల వేంకటేశ్వరరావుగారు వారి రచనల ద్వారా ఒక అయిదు సంవత్సరాల క్రింత నాకు పరిచయం. ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయంలో పరిశోధక పర్యవేక్షకునిగా ఉన్న నా దగ్గరకు యాతగిరి, భీమసేన అనే తెలుగు అధ్యాపకులు వచ్చారు. ఏదో ఒక పరిశోధనాంశాన్ని సూచించమని అడగటంతో "మీ ప్రాంతంలో బాగా రచనలు చేసి లోకానికి విస్తృతంగా పరిచయం కాని రచయితలు ఎవరైనా ఉంటే ఆ రచయిత రచనల్ని పరిశోధనాంశంగా స్వీకరించమని సూచించాను". నా సూచనను పాటించిన భీమసేన తమ ప్రాంతంలో తేజోమూర్తుల వేంకటేశ్వరరావుగారు అనే మంచి రచయిత ఉన్నారని, వారికి సంబంధించిన పలు రచనల్ని సేకరించి నాకు చూపటంతో వారి రచనల మీద పరిశోధన చేయవలసిందిగా సూచించాను. భీమసేనను తేజోమూర్తుల వారు రచించిన పలు ప్రక్రియల్ని విశ్లేషించి ఇటీవల డాక్టరేటు పట్టాను పొందటం అభినందించదగిన విషయం.

మారుతున్న కాలంలో సాహిత్యాన్ని అధ్యయనం చేసేవారు, రచించేవారు తగ్గిపోతున్నారన్నది వాస్తవం. అందులో పద్య సాహిత్యాన్ని పట్టించుకునేవారు మరీ తక్కువ మంది. అయినా ఆధునిక కాలంలో వచన సాహిత్యంతో పాటు పద్య సాహిత్యం కూడా తన గమనాన్ని సాగిస్తూ ఉండటం గమనార్హం. వచన కవితలు వెలువడినంత సంఖ్యలో పద్య కవితలు రాకపోయినా ఆధునిక జీవితాన్ని కూడా పద్యకవులు తమ రచనల్లో చిత్రించటం ఆనందకరమైన విషయం.

శ్రీ తేజోమూర్తుల వేంకటేశ్వరరావుగారు తెలుగు ఉపాధ్యాయులుగా సేవలందించారు. ఒకవైపు ఉపాధ్యాయ వృత్తి, మరోవైపు రచనా వ్యాసంగం, ఇంకొకవైపు నటనారంగం – త్రివేణీ సంగమంగా తేజోమూర్తుల వారు తమ ప్రయాణాన్ని సాగించారు, సాగిస్తున్నారు. వీరు శతకాలు, సుప్రభాతాలు, పద్య కృతులు, వచన రచనలు, నాటకాలు, నాటికలు బహు సంఖ్యలో రచించారు. వీరి రచనల్లో ఆధ్యాత్మికత, సామాజికత ప్రతిబింబిస్తూ ఉంటాయి. 75 సంవత్సరాల వయసులో కూడా తేజోమూర్తుల వారు ద్విగుణీకృత ఉత్సాహంతో రచనలు చెయ్యటం అభినందనీయం.

శ్రీ తేజోమూర్తుల వారి కలం నుంచి ప్రస్తుతం వెలువడిన కావ్యం "ఇంద్రధనుస్సు". తెలుగువారి చిరునామాను అంతర్జాతీయ వేదికల మీద నిలిపిన "దివిసీమ గాంధీ" శ్రీ మండలి వెంకట కృష్ణారావు గారి జీవనయానాన్ని రాజకీయ, సాంఘిక సేవా కార్యక్రమాల్ని దృష్టిలో పెట్టుకొని కవిగారు "ఇంద్రధనుస్సు" కావ్యాన్ని రచించారు. కవిగారు దీనిని ఒక స్మృతి కావ్యంగా పేర్కొన్నారు. 'ఇంద్రధనుస్సు' సప్తవర్ణ రంజితం. అలాగే అనేక రంగాలలో మండలి వారి సేవలు వ్యాపించాయి కాబట్టి కవిగారు తాము రచించిన కావ్యానికి 'ఇంద్రధనుస్సు' అనే పేరును పెట్టటం ఎంతో సముచితంగా ఉంది.

వ్యక్తి జీవితాన్ని పద్య రూపంలో చిత్రించటం కొంత కష్టమైన పని. కల్పనలకు అవకాశం ఉండదు. వాస్తవ జీవితాన్ని ప్రతిబింబింప చేయాలి. తేజోమూర్తుల వారు సామాజిక వాస్తవికతను పద్య రూపంలో ప్రతిబింబింప జేస్తూ రచనను సాగించిన తీరు ప్రశంసనీయంగా ఉంది.

సహజ ప్రతిభావంతులైన తేజోమూర్తుల వారు విశిష్టమైన శబ్దజాలంతో, భావవైచిత్రితో, ఛందస్సు మీద అధికారంతో 'ఇంద్రధనుస్సు' కావ్యాన్ని రచించినట్లు స్పష్టమవుతుంది. భావ విస్తృతిని పద్యంలో బంధించటానికి సీస పద్యం బాగా ఉపకరిస్తుందని కవిగారు నిరూపించారు. శ్రీనాథుడుని తలపింప జేసే రీతిలో సీస పద్యాలు రచించారు. ఇతరమైన ఛందస్సులను కూడా సందర్భానుసారంగా స్వీకరించారు.

తేజోమూర్తుల వారు ఈ కావ్యంలో మండలి వారి వంశ వైశిష్ట్యాన్ని, దివిసీమ వైభవాన్ని, మండలి వారి సంస్కార బలాన్ని, వారిలో ప్రతిబింబించిన జాతీయ భావాల్ని, వారు శాసనసభకు ఏకగ్రీవంగా ఎన్నికైన తీరును, మంత్రి పదవిని నిర్వహించిన వైనాన్ని, ప్రపంచ తెలుగు మహాసభల నిర్వహణా సామర్థ్యాన్ని - ఇలా ఎన్నో విశేషాల్ని వివరించారు.

**తే. వ్యాసములు ప్రశంసములు ప్రకటిత మయె**
**ప్రచరితం బాయెను 'మరపురాని మనిషి'**
**నేడు స్మృతి పద్యకావ్యమై నిట్టుల విను**
**'వీధి' ఇంద్రధనుస్సు నావిర్భవించె**

...అని తమ కావ్యం ఆవిర్భవించిన తీరును ప్రస్తావించారు. 'కావ్యాంత గద్య'ను కూడా వీరు రచించి తమ సంప్రదాయానురక్తిని ప్రకటించారు. ఈ కావ్యానికి ముందుమాటను రచించే అదృష్టం కలిగినందుకు సంతోషిస్తున్నాను.

**తే. పద్యమే ప్రాణమై వెల్గు పండితుండు**
**వేంకటేశ్వర రాయండు విదిత యశుడు**
**నిలిపి 'ఇంద్రధనుస్సు'ను నేల మీద**
**కావ్య రాజమై మిక్కిలి క్రాలునట్లు.**



# ప్రేరణ

అంతా భగవంతుని విలాసమే. సంయోగ వియోగములు భగవదధీనము. ఆయన సంకల్పము వలెననే జరుగుతుంది. కాలంధర్మం అన్నిటికి మూలం. కాకతాళీయముగా మండలి ఫౌండేషన్ వారి ప్రకటన నాకంట పడకపోయినా మా రక్త సంబంధీకులు, బంధుమిత్రుల ద్వారా ఆ సమాచారము నాకు అందజేయమని పంపబడినవి. అది నా వలన కాదనుకొని మిన్నకుంటిని. అయినా దైవ ప్రేరణచే నాలో భావ సంచలనం ఏర్పడుట వలన పోటీ ఖండ కావ్యము ప్రారంభించడం పూర్తి చేయడం నా సుకృతముగా భావిస్తున్నాను.

అది అయిన పిదప మాతృభాష ఆధునిక కాలములో క్షీణ దశకు చేరుకునే సమయాన పద్య కావ్యములపై ప్రజానీకంలో మోజు తగ్గడం, ప్రోత్సహించే నాథుడు లేక కొడిగట్టే దీపంలా ఉన్న తరుణంలో మండలి ఫౌండేషన్ వారి కృషి చీకట్లో చిఱు దీపంలా ఉండుట వలన మండలి ఫౌండేషన్. దాని అధ్యక్షుడు శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారి కృషి అభినందనీయమే! ఆయన కృషి ఎంతవఱకు ఫలిస్తుందో దైవమునకెఱుక. అయినా సత్ఫలదాయకమగునని ఆశించుట అతిశయోక్తి కానేరదు.

అది అట్లుండ నిండు. కీ.శే. గౌరవనీయులు “మండలి వేంకట కృష్ణారావుగారి జయంతి” సందర్భమున మండలి ఫౌండేషన్ ఆహ్వానమన్న శీర్షిక నన్ను మిక్కిలి ఆకర్షించినది.

ఆ మహనీయుని వ్యక్తిత్వం గొప్పదని నా ఊహకు తట్టినది. అసలు ఆయన గూర్చి సమాచారం నా వద్ద లేదు. కావ్యము ఆయన పేర వ్రాద్దామని తలపు లేదు. అతిశయోక్తులతో, ఉత్ప్రేక్షలతో వ్రాయడం నా స్వభావానికి విరుద్ధము అయినా నా యుక్త వయసు నుండి ఉపాధ్యాయ సోదరుల పదవీవిరమణ సందర్భమున బంధుమిత్రాదుల వివాహ మహోత్సవ సందర్భమున తదితర మహోన్నత కార్యక్రమములందు వారల నభినందిస్తూ వ్రాసిన పద్యములు సన్మాన పత్రములు శతాధికము. ఇంతలో మా అల్లుడు మా ఇంటికి వచ్చిరి. ప్రాసంగికంగా పోటీ ‘ఖండ కావ్యము’ ల సంగతి ఏమైనది అని అడగడం పూర్తి అయినదని చెప్పి ఆ పుస్తకం వానికి అందించడం, స్వల్పకాలంలో సాంగముగా చదివి అభినందించడం జరిగింది. మండలి కృష్ణారావు గారి గుఱించి నీకేమైనా తెలియునా? అని ప్రశ్నించగా తెలియదని చెప్పడం జరిగింది. అది విని ఆయన తండ్రి ‘ఉపాధ్యాయుడు’. ఆయన బిడ్డ మహోన్నతుడు. తండ్రికి తగ్గ తనయుడని చెప్పడం జరిగింది. అయితే మండలి కృష్ణారావుగారి భోగట్టా నీకేమైనా అదనం తెలిస్తే చెప్పమనే సరికి ఆయన గూర్చి కొంత వఱకు పరిచయం చేయగా విషయాన్ని వెంటనే కొంత

వఱకు ఆయనపై జయంతి సందర్భంలో కొన్ని పద్యములు వ్రాస్తే బాగుంటుందని అనుకోవడం వెంటనే కొన్ని పద్యములు అల్లడం వానికి వినిపించడం జరిగింది. అయినా తృప్తి తీరలేదు. ఆయన వ్యక్తిత్వము నన్ను అబ్బురపరచింది. దీనిని కావ్యముగా మలిస్తే బాగుండునని శ్రీ మండలి బుద్ధప్రసాద్ గార్కి ఫోను చేయడం నా మనసులోని మాట వారికి మనవి చేయడం, వారు సహృదయులుగా కొంత సమాచారం ఇవ్వడం జరిగింది. అయినా ఇంకా ఏమైనా ఉన్నదా కుటుంబ వివరాలు తెలిసికోవలసి మరల అడుగగా ఆయన దయతో 'మహితాత్ముడు' పుస్తకం వాట్సప్ వదలడం జరిగింది. దాంతో నాకు మఱింత సమాచారం అందడంతో 'మరపురాని మనిషి' అనే ఈ కావ్యము ఈ రూపమున ఆవిర్భవించడం క్షణాల మీద జరిగిపోయినది.

'మహితాత్ముడు' పై ఇంకా ఎన్నో గ్రంథాలు ఉండగా మరల పద్య కావ్యమేమిటి ఎవరు చదువుతారు అన్న ప్రశ్న కలిగినా ఏదో నా బుద్ధికి తోచినది వ్రాస్తున్నాను. అది వారికి నచ్చునో నచ్చదో ఏమో! అయినా నా కృషి తప్పదు. 'మండలి వేంకట కృష్ణారావు' గారే పట్టుపట్టి వ్రాయిస్తుండగా ఆపడానికి ఆగడానికి నాకు శక్యమా అని ముందడుగు వేయడం జరిగినది. చిన్న గ్రంథమైనది. లోకంలో ఎన్నో రామాయణములు పుట్టినవి. ఎందఱో కవులు వ్రాశారు. అయినా ఎవరి రచన వారిది. ఎవరి శైలి వారిది. అలాగే వస్తువు ఒకటి యైన కవిని బట్టి గ్రంథము మారును. దేని ప్రాశస్త్యం దానిదే! ఒకే కూర తల్లి, అక్కాచెల్లెళ్లు, భార్య, అత్తగారు మున్నగు వారు చేస్తే రుచి చూస్తే భేదమున్నట్లే కావ్యభేదములు ఉండును అని సరిపెట్టుకొని దీని పూనికగా దీక్షగా ఏకబిగిన తక్కువ కాలమున పూర్తి చేయగలిగేలా చేసిన ఆ భగవంతునకు కృతజ్ఞతాభివందనములు.

ఇందులో మండలి వేంకట కృష్ణారావుగారి 'వ్యక్తిత్వము' ప్రతిబింబించే ఎన్నో సంఘటనలు ఉన్నాయి. అవి ఆయన మూర్తిమత్వానికి దృష్టాంతములుగా నిరూపించడానికి ననువుగా నున్నాయి. ఆయన జీవితములో జరిగిన ముఖ్యమైన సంఘటనలను ఆయన వ్యక్తిత్వమునకు గీటురాయి అయిన వాటిని తీసికొని మరింత లోతుగా ఆయన హృదయాన్ని ఆవిష్కరించడానికి ప్రయత్నించినాను. అందు నేనెంత కృతకృత్యుడనయితినో నిర్ణేతలు పఠితలకన్నా ఆయన బిడ్డలు పరిచయస్థులు బంధుమిత్రులు, పరిచయస్థులు మాత్రము నిర్ణయించగలరు. ఇంతకు ముందు ఆయన్ని ఎన్నో రీతులు అభినందించినారు.

ఒక వ్యక్తి గుణగణములు, వ్యక్తిత్వము నిర్ణయించుటకు వారి 1. వర్తనము 2. మాటతీరు 3. ఆలోచన 4. వైఖరి 5. పోకడలు 6. అభిరుచులు 7. అలవాట్లు 8. సమాలోచనలు ఇవన్నీ ఆయన మూర్తిమత్వమునకు దోహదము చేయుచున్నవి.

ఇందులో ప్రధానముగా మూడు తరముల ప్రస్తావన నువిడింపబడినవి. ఏ వ్యక్తిత్వము వ్యక్తము చేయడంలో 1. వంశము 2. పరిసరములు పరిశీలన ముఖ్యము.

వంశము పూర్వపరములు, పుట్టు పూర్వోత్తరములావశ్యకము. అందుచేతనే దానిపై దృష్టి కేంద్రీకరించి 1. తండ్రి, తల్లి 2. నాయకుడు 3. నాయకురాలు (ఇల్లాలు) 4. సంతానము మున్నగు మూడు తరములు పరిశీలించుట జరిగినది. వాటి ద్వారా ఈయన వ్యక్తి నిర్ణయించడము జరిగినది. ఇదంతా నా ప్రణాళిక. దానిని మీ ముందుంచినాను.

ఇది పద్య గ్రంథము కాబట్టి కొందఱు ఇట్టి గ్రంథాన్ని పుచ్చుకున్నా వారగా త్రోసివేయుట జరుగవచ్చును. కాని పాఠకులకు మనవి. కాని ఏదైనా ఏదో ప్రక్రియ ద్వారా గ్రంథాన్ని రచించినపుడు ఆ కవి పడిన శ్రమ కృషి గుర్తించి దాన్ని పూర్తిగా చదివి అవగాహన చేసికొని వారు కవికి అభిప్రాయము తెలియపఱచుట సముచితము.

సరే! అది అటుండనిండు. ఒక్క మనవి: శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారూ! మీరు మీ తండ్రి గారిని గూర్చి వ్రాసిన ఈ “ఇంద్రధనుస్సు” గ్రంథము వ్రాతప్రతిని తీరిక చేసుకొని చదివి తమ అమూల్య అభిప్రాయము తెలియజేసిన కృతజ్ఞుణ్ణి. ఇందులోని ఏ అంశము మీ హృదయాన్ని కదిలిస్తే నా కృషి ఫలించినట్లే! నేను ధన్యుడనయినట్లే!

నాకీ అవకాశము భగవానుడు ప్రసాదించినందుకు ఆయనకు కృతజ్ఞతాభివందనములు సమర్పించుకొనుచున్నాను. మీతో పరిచయము స్వల్పము. అదీ ఫోను ద్వారా తగిన సమయమునకు కావలసిన సమాచారమందించడం జరిగినది. సంతోషము! శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారికి కృతజ్ఞతాభివందనములు. మనసులోని మాట మీ ముందుంచితిని. పుస్తకం మీ చేతుల్లో ఉన్నది. నిర్ణేతలు పఠితులు! లోకులు భిన్న రుచి గలవారు. ఎవరి అభిప్రాయము వారిది. ఏది ఏమైన ఆనందదాయకము. ఇక శలవు.

పాయకరావుపేట **రచయిత**

తేది: 18.7.2021

## గ్రంథకర్త జననీ జనకులు



**కీ.శే. తేజోమూర్తుల రామగోవింద గారు**
**వారి భార్య లక్ష్మీనరసయ్యమ్మ గారు**

## గ్రంథకర్త



**తేజోమూర్తుల వేంకటేశ్వరరావు**
**భార్య శ్రీమతి ఆనందకుమారి**

# సమర్పణ



గీ. విజయ నగర సామ్రాజ్యంబు విస్తరణకు
సుస్థిరతకు మూలంబునై సూవెలుంగు
మండలికుల జుల్పూర్వంబునుండియమిత
దేశభక్తి తత్పరత సందీప్తులొలయ

యువతనేతయై యాంధ్రను నున్నతంపు
పదవులొంది, పైకెదుగుచు, వాసిగాంచి,
జనహృదయములను నిలిచి, ఘనజయమ్ము
పొంది, బిరుదులు సన్మానమొంది, తెలుగు
ప్రముఖనేతల చేతనే ప్రణతులంది
రాజకీయ పటిమ చతురతయు, ఘనత,
మాన్యత, నిబద్ధత, సమత, మహితదీప్తి,
పాలనా దక్షత, నవతయు, పారదర్శ
కతయు, నంకిత భావంబు, కార్య సాను
కూల్యత, రసజ్ఞత, మమత, కూర్మిఁబేర్మి
విజ్ఞత, కృతజ్ఞతయు, సమయజ్ఞత, కృప
ణతయు, సౌమ్యత, మితభాషణము, సరళత,
దాంతి, శాంతిప్రియత్వంబు, క్షాంతి, మైత్రి,
మాతృ పితృభక్తియు తునకు, మాదుకృతిని
అలరు వేంకట కృష్ణరాయార్యునకును
ఇత్తు "ఇంద్రధనుస్సును" తృప్తి తోడ

– **రచయిత**

# ఇంద్రధనుస్సు

(శ్రీ మండలి వెంకట కృష్ణారావు)

సీ. శ్రీకరమై సదా శివకరమై దివ్య
శోభాకరంబునై, శోభితమయి
సత్యమనంత విజ్ఞానమయంబునై
ధర్మస్వరూపమై, తాత్త్వికమయి,
పరమై, వరేణ్యమై, భాగవతంబునై,
భూరి విభూతిమై, భోగియగుచు
శ్రీపద కల్పమై, చిన్మయమై, జీవ
చైతన్య శక్తిమై జ్ఞానమునయి,

గీ. సంహిత సహిత వినుతమై సంహిత పిత
యై, యచింత్యమై ప్రణవమై యాత్మనతిశ
యించు పరమేశ్వరుఁడపార కృపవహించి,
లెస్స "మండలి కులజుల" బ్రీతిఁగాత. 1

సీ. వాడుక చొప్పున వేడుక గ జరుగు
పుట్టిన దినమొక స్ఫూర్తి దీప్తి
జగమందు సృష్టిని చావుపుట్టువు లెప్డు
సకల జీవులకును సహజముగదె
సారెకు సారెకు స్వాంతంబు నందున
"మధుర స్మృతుల"జాడమసకబారు
"మండలి" వారల మహనీయ మైనట్టి
ఆత్మీయతాముద్ర లతిశయించు

గీ. పృథ్వి మండలి "వేంకట కృష్ణరావు"
ఆంధ్ర తేజంబు, మానంబు, ఆంధ్రరాజ
కీయ వేత్తయు, విజ్ఞాని, ధీయుతుండు
ధార్మికుఁడు నాధునిక మార్గదర్శకుండు 2

సీ. విధి విలాసంబున విజయనగర రాజ్య
పతనమై నంతనే ప్రజలు తరలె
ఆంధ్రదేశానికి నానాడు తరలి వచ్చి నిలచె
"మండలి" వంశంబు మెండు ధృతిని
దివిసీమ యందున స్థిరపడె వీరల
మూల పురుషుఁడు, ప్రముఖుడు, ఘనుడు
సేనాధిపతియగు "చినపోతు నీడు"వీ
రాధి వీరుండు శూర వరుడు సుమి

గీ. దేశభక్తి తత్పరుఁడు సుదీరగుణుడు
రాజపూజితుండుపకారి, ప్రాభవుండు
ఆత్మబంధువు పూర్ణ దయార్ణవుండు
సాధుసత్యంగసేవ్యుండు సహనశీలి. 3

గీ. చండ మార్తాండ తేజులు శౌర్యధనులు
విజయనగరరాజుల ఘనవిజయకరులు
మేరుధీర గంభీరులు, మేటి ఘనులు
మహిని మండలి వంశజుల్మాన్యులుగదె 4

సీ. "దివిసీమ విభవంబు" దేవతలకునైన
వర్ణింపశక్యంబె బ్రహ్మకైన
దివ్య ప్రదేశాల దీప్యమానమగుట
కతననె "దివిసీమ" ఘనతకెక్కె
"కృష్ణ"కునుత్తర క్షేత్రంపు లంకయే
"దివిసీమ" యాయెనేతెలుగు నేల
ఇచ్చటి ప్రకృతియే ముచ్చట గొల్పుచు
ఆత్మకు నిత్యంబు హాయి గొల్పు

గీ. దివ్వెలుగు సీమ దివిసీమ దివికి ప్రతి ఫ
లిత మొయనఁదగు నందురు ప్రీతితోడ

ఆంధ్రభూమికే మకుటంబు నంచు నమిత
మబ్బురంబుగా బుధకోటి మహితగతిని. 5

సీ. ఒకవంక కృష్ణమ్మ ఒయ్యారి నడకల
నష్టలక్ష్ములుగ నుయ్యాల లూపు
తీర్థపుంక్షేత్రాల దివ్య సుక్షేత్రాల
ముక్కారు పంటల పిక్కటిల్లు
వీరులు, శూరులు, ధీరులు, త్యాగులు,
నర్తకీ నర్తకుల్, నటులు కవులు
గాయకుల్, దేశ భక్త శిఖామణులు, బుధుల్,
సంఘసేవకులను, సైనికులును

గీ. శాస్త్రవేత్తలు, వైద్యులు, సంఘసేవ
కులును, సాహితీప్రియులు, కళల నిపుణులు,
వేదపండితులును, పరిశోధకులును,
మాతృభాషాభిమానులు మాన్యులుంద్రు 6

సీ. శ్రీయుత భారత క్షితి తల మందున
అన్నపూర్ణగ నిల్చె "ఆంధ్ర" పదము
కృష్ణానదీ తీర హృద్యతరంబునౌ
"అవనిగడ్డ" పుమండల వరసీమ
"భావదేవరపల్లి" వాసియై "మండలి
వేంకట రామయ్య" విమలమూర్తి
అందఱి మన్ననలందెడి "యధ్యాప
కుండు" సామాన్యుఁడు కోవిదుండు

గీ. గుణగణ గరిష్ఠుఁడు, ఘనుడు కుల వివర్ధ
నుండు, నభిమానధనుఁడు, మాన్యుడు, నిగర్వి,
పూర్ణ కరుణామయుండుసు పూతచరిత,
లోకులకునిరతము తలలోనినాల్క. 7

సీ. ఆయన భార్య "మహంకాళి" యచ్చుగ్రుద్దినటుల
ఆంధ్రత్వమెడనెడ నావహించు
కట్టు బొట్టుల యందు పెట్టు పోతల యందు
హైందవ సంస్కృతి నాదరించు
అత్తమామల పట్ల నధిక మాదరణంబు
సాటి వారల యెడ సఖ్యతయును
బీదసాదల పట్ల విపరీత కృపణత
నధికుల యెడల వినమ్రతయును

గీ. పూర్వ సంప్రదాయజ్ఞయు, భూరి దొడ్డ
తనము, పిన్నల పట్ల వాత్సల్య దృష్టి
పతి మతి నెఱిగి మెలగెడి యతిగుణవతి
కలుపుగోరుతనము సదా కలిగియుండె 8

సీ. ఆయన మూడు దశాబ్దాల నాదర్శ
గురువుగానే మున్నె క్షోణి నిలచె
సంస్కారవంతుడు, సన్నుతగాత్రుఁడు,
సాత్త్విక తత్త్వుఁడు, సచ్చరితుఁడు,
విశ్వ హితైషి, వివేకియు, గ్రామసం
క్షేమమ్ము వృద్ధికై కేలుగలుపు
మానవ సేవయే మాధవ సేవగా
మరువక సేవించు మంచి మనిషి

గీ. మాననీయుండు, మాన్యుండు, మానధనుఁడు,
మధ్యరక కుటుంబీకుఁడు, మధుర వాజ్మి,
సౌమ్యుఁడు, ఋజువర్తనుఁడును, సహనశీలి,
నిష్కపటియు, నుదారుఁడు, నీతిపరుఁడు 9

సీ. మహిత సుకృతమున మండలి యింటను
మూర్తిత్రయంబన ముగురు సుతులు
కన్న కలల పంట, వెన్నంటి నంటంగ
కులముద్ధరింపంగ కలిగి నారు
జ్యేష్ఠుండు "వేంకట కృష్ణరావు"ను, మధ్య
ముండు నైన 'జనార్ద' నుండు, తుదను
ప్రముఖ నీలాంబరరావు నా బరగిరి
వంశ తిలకులయి వాసిగాంచె

గీ. కన్నవారల గుణములు నన్ని పుణికి
పుచ్చుకున్నట్టి వా'రలౌ' సచ్చరితులు
కన్నవారికి మాత్రంబు కనులవెలుగు
వెలుగు దివ్వెలై నిల్చిరి తెలుగునేల 10

సీ. గతము స్మృతి పథాన కదలాడు హృదయమ్ము
నార్ద్రీ కృతంబౌచు నతిశయించు
కనుకొలకుల కనీ కల మోద ఖేదాల
బిందు సందోహముల్ కందళించు
తలిదండ్రుల యెడల దయ పొంగిపొరలును
పిల్లలపై ప్రేమ వెల్లివిరిసె
గత తీపి చేదులు కలగలుపులొలసి
విలువల పోషించి నిలిపె నిటుల

గీ. మహిత మానవత, మమత, మహిత గతియు,
పరమ జాతీయత, సమత, కరుణ, దృఢత,
స్వచ్ఛ హైందవ సంస్కృతి, క్షాంతి, శాంతి,
దాంతి, ధృతియు, కలిగె తలిదండ్రి వలెనె 11

సీ. తండ్రి గురువయి విద్యాప్రదానముఁజేయ
వంశగౌరవదీప్తి వన్నె దెచ్చె
మాటికి మాటికి మానవత్వంబుతో
డను కరసాయమ్ము లందజేసె
ఆకుమాటున పిందెలలరారు కరణిని
ముద్దుముచ్చటలన్ని పొల్పు నిడిరి
తలిదండ్రి పోషణన్ ధార్మికత్వంబుపెం
పొందింపజేసెను విపులమతిని

గీ. తరతరాల సత్కీర్తిని తరుగనీక
తండ్రినే మించి పోయిన తనయుడగుచు
దేశదేశ విదేశాల దివ్యకీర్తి
ధరణి నిల్పి యమరజీవి తరలిపోయె 12

సీ. జనసేవ కాంక్షయే చక్కగా మండలి
వంశీయులందున వాహిని వలె
తరతరాలుగనె రక్తంబున ప్రవహించు
చుండును కాయాల మెండుగానె
గాంధేయవాదియై ఖద్దరు ధరియించి
దేశాభిమానులై దీక్షబూని
దాస్య విముక్తికై త్యాగులై నిల్చిరి
ప్రాణములను తృణప్రాయముగనె

గీ. నెంచి బలి దాన మొనరించి నెగడి నారు
తాము జాతీయ వాదులై తనరి దేశ
భక్తులై ధన్యజీవులై వరలె నే యు
దారచరితులై విఖ్యాతిఁదనరినారు. 13

సీ. కొల్లేటి తీరాన "పల్లెవాడ" గ్రామ
మందు పుట్టి పెటిగె అమ్మనాన్న
ల కడను కడు ముద్దుల సుతుడు వేంకట
కృష్ణరావు గడపె తృప్తి తోడ
'భావదేవరపల్లి' వాడను నత్యంత
గారాబముగ సదా క్రమముగానె
శైశవంబందున జనకుని నారాధ్య
గాంధి నారాధ్యమౌ ఖద్దరునిక

గీ. ఇంటి వారంత నేకమ్ము నిష్టముగనె
ప్రీతి పూర్వకంబుగ నిక విధిగ దాల్చు
వాడుకగ లక్ష్యసిద్ధికిఁవేడుకగనె
ఇట్టి హైందవత్వంబంత నుట్టి వడగ 14

సీ. పుణ్యదంపతుల సుపుత్రుండు మండలి
కులదీపకుండు, సుగుణయుతుండు,
సాత్త్వికుండు, హితుఁడు, సాహిత్య వేత్తయు,
అతులిత పరహిత చతురమతియు,
గాంధేయవాది, విఖ్యాత చరిత్రుండు,
జ్ఞాన సంపన్నుండు, సహనశీలి,
'దివిసీమ గాంధి" విస్తృతసేవకు డనుచు
ప్రజల ప్రేమను పొందె ప్రాభవమున

గీ. ప్రబల జాతీయ కాంగ్రేసువాది యతడు
ఇద్ధ మూర్తి "తెలుగుతల్లి ముద్దుబిడ్డ"
దివ్య "దివిసీమ కేసరి" దీప్తమూర్తి
కృష్ణ గెడ్డ నడ్డాల పెరిగిన బిడ్డ 15

సీ. జనకుని చెంతనే శ్రద్ధగా స్పర్థగా
"ప్రాథమికపు" విద్య పట్టుబడియె
తండ్రి తర్ఫీదున తరతరాల చదువు
అనతి కాలంబున వినయముగనె
"అవనిగడ్డ"ను తనునందఱితో బాటు
పై విద్య నున్నత పాఠశాల
నందున లెస్సగా నాత్మ బలిమి తోడ
నుత్తమ గురువుల యొద్ద యొద్ది

గీ. కగనె పెద్దల పద్ధతిగానె హద్దు
మీఱకయె గురుభక్తిని మేలు భళిగ
పై చదువుల చదివి తాను పట్ట భద్రు
డాయె "వేంకట కృష్ణ రావాహ్వయుండు" 16

సీ. విద్యా విధానాన విధిగపరీక్షా వి
ధానమ్ము నందు నుద్యమము నందు
విద్యార్థి నేతయై విస్తృతముగ పాల్గొ
ని విజయమొందెను నేకబిగిని
స్వాతంత్ర్య మొప్పెడి సమయాన సమ్మెకు
నేతయై పాల్గొనె నిశ్చయముగ
విద్యార్థి దశ యందు విద్యార్థి నాయకుం
డయి శైశవంబున రాజకీయ
మునకట్లు శ్రీకారమును జుట్టి యంచెలు
నంచెలుగ నెదిగె నమ్రతగనె
ఆధునికాంధ్రకే యానాడు జాతీయ
విద్యార్థియై యొప్పి వెల్లివిరిసె
స్వారాజ్యసిద్ధికై జాతీయ కాంగ్రెస్సు
పక్షాన నుద్యమ పదవి బూని

పెక్కు నుద్యమముల పెంపెక్కి క్విట్ ఇండి
యా భువిగర్భాన నధిక నొర్మి
కార్మికునిగ జేరి కన్న దేశ ఋణము
తృప్తిమై శ్రీఘంబు తీర్చుకొనియె
రాయలసీమలో ప్రాణాంతకంబైన
కరువును వశమున కార్యముననె
విరివిగా పాల్గొని పెద్దల మన్ననల్
పాత్రుఁడై చాటె కృపారసంబు
దివిసీమ యందలి యువత కాంగ్రేసుకు
నధ్యక్షుడై మెల్గె నలుతెఱగుల
మద్రాసు నందున మర్యాద పూర్వకం
బుగ తెల్గు పక్షాన పొల్పు మీఱ

గీ. తెలుగు సంస్కృతి పీఠంబు తెలుగు వెలుగు
అనుచు సత్కరించెను గాదె యతని నాడె
తెలుగు వారలు గర్వింప విలువఁబెంచ
తెలుగు తీపిఁదనమ్మును తెలియఁబఱచె 17

సీ. మంచికి మారుగా మానవత్వపుఫరి
మళమును వెదజల్లె మానికముగ
"డ" విణము మ్రోగిఁచె ధమధమయనసదా
శత్రు గుండెలు ప్రీల సాహసమున
లిప్సను తనునవలీలగా రాజకీ
యమునడపుచు ఘన యశముగాంచె
వేంకటనామాన విజయంబునార్జించి,
పదవులన్నింటికి వన్నె దెచ్చె
కృపణత్వము వహించి కెరలి విజ్ఞాన ని
ష్ణాతయై ఎదుగుచు సరిగ నొదిగె

రాజ్యంబు నేలుచు ప్రజల సంతోషంబు
పరచితివి గదె శోభావహముగ
ప్రతిఫలించెను గాదె పాలనా పటిమ ని
వురు గప్పు నిప్పుగా పొలిచి యుండె

గీ. గురువునే మించు శిష్యుఁడై కోటి వెలుగు
తెలుగు వెలుగునై దేశవిదేశనేలఁ
తెలుగు భాషకు వన్నియ దెచ్చె మున్ను
మాతృభాషాభిమానియై మానితముగ 18

సీ. ఆట పాటల తోడ నల్లారుముద్దుగా
చకచక బాల్యంబు సాగిపోయె
కాలక్రమంబున కఠిన నియమముల
విద్యార్థి దశ నేగె వింతగానె
యౌవన కాలాన నాయన చిత్తాన
నాయక బీజాలు నాటు కొనియె
దేశ దాస్య విముక్తి ధీనిధుల్ చాటెడి
దేశభక్తుల వాణి తీవ్రపఱచె
దేశభక్తుడు గురుదేవభవరుఁడునౌ
కోటేశ్వరుని బోధ కూడ ప్రేర
ణంబును గావింప నాట గోలెన్ జేర
రాజకీయంబున ప్రథమముగనె

గీ. గురుని మార్గ దర్శకునిగ గొనుచు నెదిగి
రాటు దేరువారల కడ దీటు గానె
సాటి వారల యందున మేటిగ నవ
లీల ఆంధ్ర తేజము నిల్పె మేలు భళిగ 19

సీ. క్రమత నెదిగి యతిరథ మహారథులైన
ప్రముఖ నాయకుల సరసన నొదిగి
పెక్కు పదవు లందు వెంపెక్కి మొక్క వో
ని తెలుగు తేజంబు నెగడి ప్రబలి
శాసనసభ యందు సభ్యునిగానె నే
కగ్రీవముగ గెల్చి కాలు పెట్టె
జాతీయ కాంగ్రేసు సభ్యుడై కొనసాగి
క్రమముగానే ముఖ్యకార్యదర్శి,
ప్రాంతీయ, తాలూక, రాష్ట్రీయ కాంగ్రేసు
కార్యదర్శి పదవుల్ కాలగతిని
పరిషదుపాధ్యక్ష పదవిని చేపట్టి
న్యాయమ్ముచేకూర్చెనయముగనె
సహకార, మత్స్యంబు, సాంఘిక సంస్థలు
సంస్కృతి విద్యల శాఖ మంత్రి

గీ. పదవులు వరించెగాదెకో భాగ్యదేవి
వెన్ను తట్టంగ పండెనే కన్నకలలు
కన్నవారల భాగ్యంబు నెన్న తరమె
ఆహహా! మహాపురుషయోగమందె గాదె 20

సీ. "మహితాత్ముడు" వరుండ, మాననీయుండును,
నాదర్శమూర్తియు, నాత్మబంధు,
కరుణా ప యోనిధి, పరమ తత్త్వగుణుండు,
నౌదార్య వంతుండు, త్యాగశీలి,
నీతివంతుండు, వినిర్మలాత్ముండును,
జ్ఞానవంతుండును, సాత్త్వికుండు,
ఆంధ్రాభిమాని, నిరాడంబరుండును,
సంఘసేవకుడు, ప్రశాంతమూర్తి,

గీ. సత్యధర్మనిరతుఁడును, సహనశీలి,
శిష్ట జనవందితుఁడు, "దివిసీమ గాంధి"
తెలుగుతల్లి బంగారుకలలను పండ
జేయ కృషి సల్పె నీయన చిత్త శుద్ధి 21

సీ. ముతక ఖద్దరు చొక్క ముతక కండువ పంచె
గాంధీయ తత్త్వంబు కానిపించు,
"ఆంధ్రుల సంస్కృతి" నాత్మీయతా ముద్ర
పలుకులో చూపులో తెలుగు ఠీవి
స్నేహంబు చిలికించి, చిఱునవ్వులొల్కించి,
ఆత్మను పట్టించు, నాంధ్ర పలుకు
తెలుగు వెలుగులీను తెలుగు జాతి తలపు
తెలుగు స్వచ్ఛదనము కలుపు జతగ

గీ. అన్ని గుణములు మనిషిగా యతిశయించి,
ఒక్కరూపు దాల్చిన యంత నిక్కముగను
పృధ్విమండలి వేంకట కృష్ణరావు
మూర్తి మూర్తి ముమ్మూర్తుల స్ఫూర్తి దీప్తి 22

సీ. పులిగడ్డ వాసి యౌ భోగాది వేంకట
రామయ్య వేంకట రామయయును
బాల్యమిత్రులు సహపాఠు లధ్యాపకుల్
నెయ్యము వియ్యము నిలుపుకొనగ
భోగాది రామయ్య పుత్రి 'ప్రభావతీ
దేవి'తో నన్యోన్యదీప్తివెలయ
ప్రముఖ వేంకట కృష్ణరావాహ్వయునకుయు
క్తవయసునందున కడకు పెండ్లి
వేంకట రామయ్య విధిగనె జరిపించె
వైభవోపేతాన పరులు మెచ్చ

గీ. బంధు మిత్రుల దీవనల్ భద్రమొసగ
వారు సంతానవంతులై బరగినారు
అలరు "బుద్ధప్రసాదు", "సత్యప్రసాద్" త
నయులు, "నన్నపూర్ణయు" "రేవతియు" తనయలు 23

గీ. అవనిగడ్డ "గాంధీక్షేత్ర" మవతరించె
గాంధి పూర్ణతత్త్వంబునకనుగుణముగ
అచటి స్థలసేకరణమున నఖిల కార్య
నిర్వహణమున భవనము నిలచె వేగ
ఆదికోసూరి వారి గ్రంథాలయమ్ము
గొట్టిపాటి వారి భవనాల్, పట్టుదలను
ప్రముఖుల విరాళముల తోడ వనితలకు భ
వనము నిర్మాణ మాయెను, వర్ధనమున
క్రమముగా ఆరుబయలు రంగస్థలంబు,
క్రీస్తు, బుద్ధ, గాంధీజీల, శస్త విగ్ర
హాలు వేంకట కృష్ణరాహ్వాయుడు నిలిపె
శిష్ట గాంధేయ సాంఘిక సేవ సంస్థ
అచ్చట "యనాథశరణాలయంబు" వెలసె
"గ్రామ యువజన సహిత వికాస సమితి"
ప్రకటితంబగు "లలిత కళా భవనము"
"సాహితియును", "బాలానంద" సదనములను
ప్రగతి కేర్పాటు గావించె సుగతి కొఱకు 24

గీ. "బడుగువర్గాల" వృద్ధికి పాటు వడియె
పుడమివర్ణాంతర వివాహములకు తనదు
వంతుగా ప్రోత్సహించెను సంతసమున
సంఘ సంస్కరణ సదస్సు సాగ నిచ్చె
మత్స్యకారుల సంక్షేమ మహిత పథక

ముల ప్రవేశపెట్టుచును వారల మహాభి
వృద్ధికొఱకు పాటు వడియె వివిధ రీతి
మాన్య సాంఘిక సంక్షేమ మంత్రిగానె
సాగి తన వంతు సేవను సాగ నిచ్చె
అవని వేంకట కృష్ణరావాహ్వాయుండు 25

కం. విద్యా శాఖా మంత్రిగ
విద్యకు నెనలేని సేవ విధిగా సలిపెన్
విద్యా నిపుణులనూతను
సద్యస్కాలమ్ము నందె చతురత నితఁడే! 26

సీ. ఉన్నత విద్యకు నున్నత ప్రగతికి
ప్రత్యేక సంస్థను వెలయజేసె
ప్రత్యేక మార్పులు ప్రస్ఫుటముగనె క
న్పట్ట నొక పదవి కట్టబెట్టె
ఒక్కొక్క తాలూక కొక్కక్క జూనియర్
డిగ్రీ కళాశాల లేర్పడె గదె
వివిధ ప్రదేశాల విశ్వవిద్యాలయం
బులు విరివిగ నెలకొలుపబడియె
గీ. క్రొత్త విద్యాప్రణాళిక రూపుదాల్ప
జేసె విద్యార్థుల క్రమశిక్షణంబు
విధిగ విద్యాప్రగతికి వివిధ గతులు వి
వేకమును పెంచగ బహుళ విస్తృతముగ 27

సీ. ఆది కాలంబున నాంధ్ర ప్రదేశమ
ఖండ స్వరూపమై ఖ్యాతి గాంచె
ఆంధ్రకున్ జాతికి నమరిన సంస్కృతి
ప్రత్యేకత వహించి బరగె మున్ను

ఆంగ్లేయ పాలన మందున ప్రత్యేక
తలు లేక పొరుగున కలిసి మెలగె
తదనంతరంబున విధిగనె ప్రత్యేక
రాష్ట్రమై వర్ధిల్లి రహి వహించె

గీ. పిదప వేర్పాటు వాదంబు వృద్ధికాగ
తలప మండలి వారికి తలకు మించె
ఐన పట్టు సడలకయె ధృతిని నిలచె
అతడు “నైక్యతావాదియై” యలరినాడు. 28

గీ. అతడు “గాంధేయ వాదియై” యనుసరించి
మార్గదర్శకంబుగ కొంత మాన్యము నిరు
పేద వారికి పంచిన విదితయశుఁడు
మెండుగా నిండు గుండెల నిండి యుండె 26

ఆ.వె. రాజకీయమందు రాణకెక్క నిలువ
ఓడి గెలిచి యున్న యుండె సమత
క్షాంతి నెఱపి నితడు శాంతి వహించెను
మేరు ధీరకడు గభీరుడౌచు 30

సీ. తెలుగు తల్లి యొడిని తొలిసారి మనసార
వైభవోపేతాన ప్రజలు మెచ్చ
రాజధాని నడిగెడ్డ “ప్రపంచ తెలుగు” మ
హా సభ జరిగె నౌరౌర యనగ
దేశ దేశాల విదేశీయ విద్వత్క
వీంద్రులు విచ్చేసె వేడ్క తోడ
వారి మధుర వాణి బాణి నాకర్ణించి
తెలుగుతల్లి తనువు పులకరించె

గీ. తెలుగుజాతి దివ్య వెలుగు నలు దిశలుగ
తెలుగు తీపిఁదనమ్మును తేట పఱచె
తెలుగు సంస్కృతి నిలువెత్తు నిలిపె జగతి
తెలుగుదేశ గౌరవము సంతృప్తి నితడు 31

సీ. ఆంధ్ర దేశంబున నంతవఱకును బ్ర
హ్మాండమైన సభ బ్రహ్మాండముగనె
ఎంత చక్కదనాన నెందఱో ప్రతినిధు
లు ప్రశంస మొనరించె ప్రోఢగానె
మాటల గారడి మంత్ర ముగ్ధులఁజేసి
యెట్టె టోప్రజల నాకట్టుకొనియె
ప్రబలిత భాషల గ్రంథమ్ములే కొన్ని
ప్రచురణము జరిగి ప్రకటితనుయె

గీ. కవులకునమిత ప్రోత్సాహకరముగానె
మంత్రి మండలి నౌదార్యమాత్రముననె
చోద్యమొప్పంగ మున్ముందు చూపు తోడ
తెలుగుదేశమున పఱచె వెలుగుబాట 32

కం. అతి విలువఁబెంచు ఘనమౌ
ద్వితీయ మౌ యా ప్రపంచ తెలుగు సభనికన్
అతినుత మండలి లేకయె
మతి చెడిన పరుల యసూయ మాత్రను జరిగెన్ 33

కం. అతుల ప్రతిష్టాకరపుం
తృతీయమౌ యా ప్రపంచతెలుగు సభనికన్
అతి నుత మండలి లేకయె
సుతుని వలననే జరిగెను శోభలు నెసగన్ 34

సీ. దివిసీమ నుప్పెన తెలుగుదేశానికే
పెనుముప్పుఘటియించె గనుగొనంగ
తీరము వెంబడి తీరని నష్టంబు
కష్టంబు భారీగ కలిగియుండె
పశువులు మానవుల్ పక్షులు శవముల
గుట్టలు పడియుండె క్షోణియందు
కూలిన ఇండ్లను కూకటి వేళ్ళతో
ధరణికి నంటిన తరువరములు

గీ. ఆర్తులార్తా రవమ్ములు నాత్మదాక
క్రమ్ముకొని నంత గన్నులు చెమ్మగిల్లె
దర్శనామాత్రమున దయార్ద్ర హృదయుండు
అపుడు మంత్రి మండలి వారలాదుకొనియె 35

సీ. దివిసీమ చెలగిన తీవ్రతర తుఫాను
ప్రళయంబు మాత్రంబు భయము వగపు
వ్యధయు కనికరము నచలత్వమును కంప
నంబు న ధైర్యంబు నావహించె
కలికాల లీలలు కళ్ళకు పొడగట్టి
చెడగొట్టె ధైర్యంబు నెడనెడనటు
అఖిల జన గణములార్తియు నెడబాపి
క్షుత్పిపాసలు బాపి కోర్కె దీర్చి

ఆ.వె. అవసరాల కోర్చి యావాస మునిలిపి
హర్ష మొదవ జేసె యనుగుణముగ
మహిత కల్ప తరువు మండలి వేంకట
కృష్ణరాహ్వయుండు తృప్తి తోడ 36

సీ. ఉప్పెన రాక్షసి గుప్పున నుప్పొంగి
మిన్నంటి ప్రజలను మ్రింగి వైచె
భీభత్సపు తుఫాను వేళను మండలి
వారి సేవలను సువర్ణ వర్ణ
లేఖనంబుచితంబు శ్రీకరంబౌ గాదె
ఇద్ధ చరితము జగద్ధితంబు
ఒంటి బట్టను కూడ నున్నట్లు పట్టించు
కొనకయే జనసేవకు నొడిగట్టె
పాదచారిగ చని వాడ వాడలుజూచి
ప్రజలకు చేయూత బలము గూర్చి
పల్కరించుచు నాత్మబలమును చేకూర్చి
జనహృదుల నడక సాగ నిచ్చె
కష్ట కాలంబున కడు ధైర్యము నొసంగి
ఓదార్పు మాటల నూరడించె
కనివిని యెఱుగని కలికాల దుస్థితిఁ
గనికరమును రేపె మనము నందు
కలి ఘోష దుస్థితి కళ్ళకు కట్టిన
రీతిగా నతడు తెలియగ పఱచె
అమిత కష్టము గానె యతి శీఘ్రముగ ప్రభు
త్వమ్మును కదలించె త్వరితగతిని
ఆంధ్ర ప్రభుత్వంపు యంత్రాగము కదల్చె
కాళ్ళ ముళ్ళను కూడ కష్టమైన
లక్ష్యశుద్ధి కొఱకు లక్ష్యమ్ము సేయక
సహన భావమ్మున శ్రమల కోర్చి
నిర్విరామంబుగా నిశ్చల దీక్షమై
పల్లె పల్లెకు నేగి పరితపించి
ఆర్తుల నోదార్చి యార్తిని పోగొట్టి
విశ్వాసము నిలిపి వెన్నుదట్టి
వెన్నుగా స్వయముగ దన్నుగా నిలబడి
కంటికి రెప్పయై కాచుకొనియె

అక్కటా కేంద్రంగా అవనిగడ్డ నొనర్చె
తీవ్ర తుఫాను, బాధితులకొఱకు
తనయిల్లు శిబిరంబు తాత్కాలికంబుగా
నిమ్ముగాసాయమ్ముముమ్మరమయె
అది పరామర్శక యాత్రా స్థలంబాయె
యోదార్పు దుస్థితి బాధితులకు
ఆయన సంతత మవిరళ కృషి చేత
స్వచ్ఛంద సంస్థలు వరుస దీరె
బహు విరాళమ్ములు, వస్త్రాలు, తిండియు
పొందిక గావేగ మంద జేసె
వారి కాయన కృషి ప్రేరణంబాయెను
ఆయన వ్యక్తిత్వ మట్టిది కదె

గీ. రాష్ట్రపతి నుండి సామాన్యుల వఱకును స
మస్త జగమంత పాయక ప్రస్తుతించె
తా ను దారచరిత్రుడై తనరు చుండె
నెపుడు మండలి వేంకట కృష్ణరావు 37

కం. మన్ననకు పాత్రుడే పే
రెన్నిక గన్న మహనీయుడితడే సుమ్మీ
ఎన్నగ మాటల మనిషియె
చెన్నగు చేతల మనిషియెచింతనచేయన్ 38

కం. వందిత మండలి వారిని
గాంధీ శిష్యుడు కనంగ కలియగ వచ్చెన్
గాంధీక్షేత్రమునకు వా
రందఱి శ్రేయంబరయ త్వర ప్రభాకరుడున్. 39

సీ. పర్యటనముగ ప్రభాకరుండు దివిసీ
మను జరుగుపనులు కనుగొనుచును

మహితాత్ముడైనట్టి మండలి వారిని
కడు ప్రశంసించుచు గారవమున
కొన్నాళ్ళ నచ్చట కోరిన మేరకు
గడపెను వారితో క్రమత మైత్రి
పాటించి, తత్కుటుంబము తోడ సంబంధ
మేర్పడె నత్తఱి నించుక గనె

గీ. తలచె పితగ ప్రభావతి తగిన విధము
జ్యేష్ఠుడు గురువుగానె పూజించె వాని
అన్నగా నెంచె యజమాని యతి చనువున
తనదు కృషి తెల్పె వానికి తనకు తానె 40

గీ. అట తుఫాను బాధితులకు నవసరములఁ
గనుచు తనకు తానుగ ప్రభాకరుఁడు వలయు
వస్తు సంపద నందించె వరుస గానె
వారి హృదయాల ముద్రను బడగ దయను 41

సీ. అప్రభాకర బృందమంతట నొకనాడు
కాలువ దాటంగ వీలుగానె
వంతెన యేర్పడె వారలావలి వైపు
చనగ వలసి వచ్చె జనపదమున
వంతెన దాట ప్రభాకరుఁడు దలచి
పడబోవగా ప్రభావతి యె గెడను
చేతికి వెంటనే యూతగ నివ్వగ
సులభగతిని దాటె కలత విడుచు

గీ. నాడు వాని కపాయంబు నాతి వలన
తప్పెనొక్క యుపాయాన నప్పటికిని
ఆమెను నభినందించెను నతడు నతి కృ
తజ్ఞతగతగ సవిమలాత్మగతము గనె 42

గీ. తండ్రి తోబాటుగా వారి తనయు డంత
దారుణ తుఫాను బాధిత తతి సహాయ
పడగ తన వంతు కృషి సల్పె పరమకృపను
సంఘసేవకుండగుట సంస్కారి యౌచు 43

సీ. ఆతడాగ్నేయాసియా పర్యటన నిమి
త్తంబున హైందవత్వంబు దోపఁ
చూపరులకు కడు చోద్యంబు నొందగ
యోగిలా కాన్పించె యున్నతముగ
అచట స్థిరపడిన నాంధ్రుల గాంచిన
పరమ సంతోష సంభరితుడాయె
పారిశుద్ధ్య విధాన పద్ధతి యనుక్రమ
శిక్షణ తోడుత చిత్త శుద్ధి

గీ. గాంచి నమితముగ పరవసించె నంత
చూడ ముచ్చట గొల్పెను తోడ గూడ
అంత తెలుగు ప్రపంచ మహాసభ జరు
ప తలపుకు బీజమే నాడు పడియె నెదను 44

గీ. పుడమిహిందీ ప్రచారమ్ము పొంద నతడు
"మారిషుకు" యాత్రకు మండలి వారి కప్పు
డు నవకాశంబు లభియించె ఘనము గానె
విస్తృతపు పర్యటన చేసి వివిధ సభల
పాల్గొనె యవిరళము గనె పలు విదేశ
దర్శనపు భాగ్యము లభించె తథ్యముగనె
"తెలుగుదాత" బిరుద మొందె తెలుగు వారి
సభలను మలేషియా యందు సాదరముగ 45

సీ. సాహితీ బంధువౌ సత్కవీంద్రుల గని
తెలుగు తల్లి తనువు పులకరింప
రాజకీయమున తలమునకలయినను
ఆంధ్ర సాహిత్యంబు నాదరించె
ఆంధ్ర సంస్కృతి పట్ల ఆంధ్రుల యెడలను
ననుపమాభిమతమ్మునతిశయించె
ఆంధ్రాభిమానంబు నణుమాత్ర మేన్నిందు
వడ జేయక నిలచె భావ పటిమ
గీ. స్ఫూర్తిచూపులో పలుకులో మూర్తిమనసు
లోన మతి లోన భావన లోన కట్ట
కడకు తెలుగు మెండగు నిండు గౌరవంబు
వసుధ నిల్పిన ఘనకీర్తి వంతుడయ్యె 46

సీ. సాహితీ ప్రియుడను, సరసజ్ఞుడు, ఘనుఁడు
వరుడు, కవి విబుధ పక్షపాతి
ప్రథిత ప్రముఖ కవివర్యులకనిశమ్ము
తల నాల్కకాచు నతండు తనరె
"ఆంధ్ర కల్పతరువై", ఆదర్శనీయమై
"ఆంధ్ర ముద్దు సుతఁడై యతిశయించె
అందఱి వాడయి నందఱి మన్నన
లంది పెంపొందుచు నలరి యుండె
గీ. ఇంత వాడు నల్లంతలో నంతరిక్ష
మందు దశ దిశ వ్యాపనీయంబు నౌచు
నిల్చె "ధృవతార"యై తాను నిఖిల జనుల
అంతరంగాల నెలకొన్న "అమరజీవి" 47

సీ. ఆంధ్ర భోజుండనై ఆశయ సిద్ధుఁడై
సంఘ సంస్కర్తయై, జ్ఞాని యగుచు,
ఆత్మబల యుతుఁడై అభినవ సాహితీ
రాజకీయ విజేత రాయలు నయి

నీతిమంతుండనై, నియమవ్రతుండవై
నిష్ఠాగరిష్ఠుఁడై, నిర్మలుడయి
శ్రేయోభిలాషియై శిష్టుడై శ్రేష్ఠుడై
ధర్మతత్త్వజ్ఞుఁడై ధన్యుఁడనయి

గీ. పండిత కవి పరీవృత మండితుఁడయి
చండశాసనోద్దండుఁడై సాత్త్వికుఁడయి
భోగమయుఁడై వదాన్యుఁడై యోగియగుచు
ఒప్పె క్షాత్ర తేజంబుతో నొప్పిదలగ 48

కం. గురుపూజోత్సవముననే
గురుదేవుని సత్కరించె కూరిమి తోడన్
గురుదీవెన లందుకొనియె
వర "మండలి" వారొకపరి భాగ్యము పండన్ 49

కం. ధీమణి మండలి వారిని
రామాయణ కల్పవృక్ష రాజమ్మున నే
క్షేమముగ శ్రోతగ కవియె
సామముగా కూర్చి యుంచె సాదరముగనే 50

కం. "మండలి" వారే మండిత
"పండిత కవి" మండల హృది భాగంబందున్
మండిత మార్తాండుండై
దండిగ స్థిరముగనె నిల్చి ధన్యుండాయెన్ 51

గీ. కన్న వారును, నిను కట్టు కొన్నవారు
పిన్నవారు నిర్మల మన సున్న వారు
మిన్నగ నినుకన్నా కుశకన్నవారు
మిన్నగాదె నీ వలననె నున్న తులును 52

గీ.	ఒక్కతూరి మండలివారు నొక్క చోట
వాహనము దిగి పరదేశ వాసులను ప
పలుకరించి బయలుదేర వాహనమ్ము
లేక గాడిలోన్ వెడలెను శీఘ్రముగనె 53

కం.	తన తనువును, గృహమును, తన
మనువును, సర్వము స్వయముగ నిడినన్
తను మాధవుని గొలుచుటయె
తన ధర్మమ్ము నిలుపుటయె తథ్యము సుమ్మీ 54

కం.	మహితాత్ముండాతండే
మహిలో గౌతముని గాంధి మదిలో గొల్చున్
విహితపు ధర్మంబుగనే
అహరహమున్బాయకుండ నతులిత భక్తిన్ 55

సీ.	మానవ సేవయే మాధవ సేవగా
క్రమముగా భావించు కర్మయోగి
డాంబిక భక్తిని ప్రబలముకానీక
అంతర్గతమ్మున నమిత భక్తి
పాతుకు పోయెను బహు దృఢముగ నంత
పుష్కళంబుగనె సంపూర్ణముగనె
మహనీయుల పరమ మానవ సేవల
కొనియాడె సువిశాలకోణ దృష్టి

ఆ.	నాస్తి కుండు కాడు ఆస్తి కుండును కాక
యున్న స్వగతమందు యున్నతుండు
భావి తరములకును భావ జాలంబును
కనగ స్ఫూర్తిదాయకమ్ముగాదె. 56

గీ. మాతృ మరణ సమయమున మానవత్వ
పూర్ణ దృష్టి వృష్టి వలన పూర్వ సంప్ర
దాయ కాంత్యోష్టి కర్మంబు క్రమము నందు
నున్న గోదానమునకును నెన్న దగిన
రీతి మిన్నగా నాయన ప్రీతి తోడ
హరిజనులకు వస్త్రము లిచ్చె పరమ గతికి
క్షోణి జనగణ మేమెచ్చుకొనగ నిదియె
పరమ పురుషార్థ సిద్ధియు నరసినంత 57

కం. మహితాత్ముని లక్షణ మిదె
మహి మోపేతమ్ముగాదె మానవత సుమీ
మహనీయంబై యొప్పెను
మహీతలం బందు తలప మండలి యందున్ 58

గీ. కాకతాళీయ ముగ ఘన కాలగతిని
కడ దశను సాయి చరితంబు కరమున నిడె
మండలి కుటుంబమునడుమ మహిఀదరింప
జ్యేష్ఠ జామాత చదువంగనెటులో ప్రోత్స
హించె నొక్కనా డాయన నెవ్వరూహ
చేయ నట్టుల యల్లుతో శీఘ్రము గనె
అవనిగెడ్డ యందున సాయి యాలయంబు
కట్ట వలె నన నల్లుడు కడకు నక్క
జవడె మామ వంకను దృష్టి సాగ నిచ్చి 59

గీ. సాయి జీవితాంతము కొనసాగె నోయి
పరమ మౌ నిరాడంబరత్వమ్ము నుండి,
మహిత మత సామరస్యంబు, మానవత్వ
విలువ పోషించెనని పల్కె తెలివి నతడు 60

గీ. ఎవ్విధమున నింతకుమునుపెన్నడైన
చెయి సాచని మండలి చిత్రగతిని
పరుల నుండియు సొమ్ము సేకరణ సేసి
సాయి మందిరమ్ము నిలిపె సంతసమున 61

కం. అవసాన కాలమందున
అవిరళముగ నతడు మదిని నంచిత భక్తిన్
సవినయమున సాయిఁదలచు
చు విడచె తను జీవముల యశోధనయుతుఁడై 62

గీ. ఆతఁడందటి వాడయెనంత కంత
అందకయె నెదిగి నొదిగె నిందు మగుడి
తిరిగి రాని పరమునకు తరలి పోయె
కీర్తిని మిగిల్చి చింత నాగ్నిని రగిల్చి 63

సీ. మండలి వారల మానవత్వమునకు
కృషి ఫలంబునన సంస్కృతిగ నిల్చె
పెనుమూడి కృష్ణకు వెను వంతెన నిక సం
స్మారక “మండలి వారధి” యయె
తెలుగుదేశంబున తిరుపతిని ప్రపంచ
తెలుగు సభ జరిపి విలువ పెంచి
మండలి పేరున మహితమౌ అంతర
జాతీయపు తెలుగు సంస్థ వెలసె

గీ. “భావదేవరపల్లి”లో ప్రముఖమైన
మాన్యమండలి పేరున “మత్స్యశాఖ”
“సర్వ సాంకేతికపు విద్య సంస్థ” వెలసె
శాశ్వతంబుగ చిహ్నామై విశ్వమందు 64

గీ. తెలుగువాడిని నను కొన్న విలువ తనువు
భావనూవేశము వలన పరవశించు
తెలుగు దేశంబు నీదన్న దివ్యలోక
వాసమనుభూతియు కలుగు భావ కలిత
మండలి పలుకులు స్మృతిని మానికముగ
మదిని సారెకు సారెకు మెదలుచుండు 65

కం. పొందికఁ ఘన విలువల పెం
పొందించుచు సుస్థిరముగ పుణ్యవశము మి
న్నొందుచు "మండలి" వారే
అందఱి మన్ననల వడసి యశము మిగిల్చెన్ 66

కం. తన తను సంస్థితినై నను
కనబడనీయక తగ జనగణములఁ దృష్టిన్
అనయము సేవకు నిలచుచు
కనుమఱుగయె సుగతిని బడి కడకు గమించెన్ 67

సీ. తండ్రి చాటుననుండు తనయుండు "బుద్ధప్ర
సాదు" నిలచె నిండు జవ్వనమున
తండ్రి సుగుణ సంపదలను పుణికి పుచ్చు
కొనుచు వెన్నంటుచు ననుసరించి
తండ్రికిన్దగి నట్టి తనయు డితండని
జనతటి ఘనముగ వినుతి సేయ
వారసత్వంబుగా పంతంబు వట్టుచు
దేశసేవకు తాను దీక్షఁబూని

గీ. తండ్రి జీవిత కాలాన తనివి తీర
తీరని సదాశయంబుల తీవ్ర కృషిని
తీర్చెను పితౄణము విధిగ తృప్తి తా న
చంచల పితృభక్తి కడకు చాటుకొనియె 68

గీ.	జనులు తను గనికొని యాడ వి నిరవంత
నుబ్బక, నిరసించి న యేనియును చలింప
కయె స్థితప్రజ్ఞుండై కడుక్షమవహించి
అతి నుదార చరిత్రుండై నలరియుండె 69

సీ.	ఆమూర్తి నేస్ఫూర్తి నావహించె నొకాని
అందఱు భక్తిమై వందనమిడు
అవ్వాణి బాణియే నవ్వాని దాగెనో
మారు మాటాడునే తీరుగాంచి
అవ్వాని నేశక్తి నంతస్థిత మయెనో
ఇంచుక నునతి క్రమించ బోరు
ఆ నవ్వు మోమునే యద్భుత మున్నదో
మంత్ర ముగ్ధులు కారె మర్త్యకోటి
గీ.	నడల, సాత్త్విక చిత్త పోకడల నే మ
హాత్మ్యముండెనో వైరులు నడగి యుండె
కెరలు మండలి వేంకట కృష్ణ రాఖ్యు
డతండె యర్థి కల్పతరువు నాశ్రితులకు 70

సీ.	"మానవ మాణిక" "బాయన గంధము"
వారిచే పొందెను బహుమతిగనె
"తెలుగు జాతి స్ఫూర్తి తెలుగు ప్రదాతను"
ప్రచురించె నే జీవిత చరితగనె
"మనిషి దృక్పథమును" మునుముద్రితంబాయె
ప్రముఖుండు మండలి వారి పేర
"మహితాత్ముడు" చరిత్ర క్ష్మాతలమున నిల్చె
స్ఫూర్తిదాయకముగ సుందరముగ
గీ.	వ్యాసములు, ప్రసంసమ్ములు ప్రకటితమయె
ప్రచురితం బాయెను "మరపురాని మనిషి"
నేడు స్మృతి పద్య కావ్యమై నిట్టుల విను
వీధి "ఇంద్రధనుస్సు" నావిర్భవించె 71

సీ. కృష్ణవేణమ్మయా కృపణత్వము వలన
కనక దుర్గాంబిక కరము నూత
విప్రబృందంబు దీవెనల బలిమి చేత
పెద్దలా శీస్సుల ప్రేరణమున
తలిదండ్రుల కడ చల్లని చూపుల
ఆలుబిడ్డల సుపుణ్యంబు చేతఁ
బంధు మిత్రాదుల బలగంబుల కతనను
పరమగురుల వత్సల తను
ఆ.వె. పుట్టి పెఱుగు నట్టి మట్టి ప్రభావంబు
తలపు కలిగి నట్టి తరుణ బలము
అత్యధికము నైన యాత్మ బలము కల్మి
ఇంత వాడె యాయె నంత వాడు 72

సీ. చే యెత్తి జై కొట్టు సీమాంధ్ర బిడ్డయే
ఎలుగెత్తి చాటెనే తెలుగు వెలుగు
కుల మత రహితుఁడై తెలుగు వారెవ్వరైన
అన్నార్తులకు సతమాశ్రితుఁడయె
బడుగు వర్గాలకు పరమదయాళువై
యేమరక నేరక భూములిచ్చె
విలవిల వాపోవు తెలుగు తల్లిని తాను
ఓదార్చి తోడాయె నోర్మితోడఁ
గీ. దిన దినమునడు గంటెడి తెలుగు భాష
దాని ప్రాచీన విభవంబు సానుభూతి
తోడనఖిల జగతికిని కూడ చాటి
తీపిందనము రుచిని చూపె తెలుగు భాష 73

సీ. ఆ దొడ్డ యిల్లాలె యాయన కర్ణాల
నే మాటలాడెనో యెవ్వడెఱుక
ఆ తండ్రి యొద్దను నల్లారు ముద్దుగా
దేశభక్తునిగానె తీర్చి నాడు

యొజ్జలాతనికి నే యుపదేశ మిచ్చెనో
చిత్త విశుద్ధిమై సేవ చేసె
సాంఘికముగ తొల్త శైశవంబున దీక్ష
నిరుగు పొరుగు వారు తృప్తి మెచ్చ
గీ. ఆలియే యూసులాడెనో యాత్మ బల్మి
అతిశయోత్సాహము వహించి యాచి తూచి
అడుగు ముందుకు వైచెనే యాత్మ సఖులు
మెచ్చుకొన నతి స్వచ్ఛమౌ స్వేచ్ఛ హెచ్చ 74

సీ. ఋజుగతి గమనంబుఋతయుతి వాణియు
విమల హృదయము వివేక మతియు
నియమ నిష్ఠ ఫణితి నీతిని జాయితీ
వజ్ర సంకల్పంబు బలిమి కలిమి
చండ శాసనము ప్రచండ తేజంబును
ధర్మగుణంబు ప్రోత్సాహకరము
దృఢ దీక్షయు ప్రగాఢ ధృతి ధారణంబును
సుకృత సత్ఫలము విశుద్ధ దృష్టి
గీ. ఊర్జి తోన్నత పదవిని యుంచు గాదె
తాను నూహించని విధమ్ము తథ్యముగనె
ప్రగతి కియ్యదే యాశయ లక్షణమయె
అతని జీవితమందు నాద్యంతముననె 75

ఆ.వె. తరతరముల నీదు చరితంబు పరికింప
స్ఫూర్తి దాయకంబు చూడ చూడ
మార్గ దర్శకంబు మానవాళికెపుడు
అంచితంబు గానె మంచి పెంచు 76

ఆ.వె. దేశ సేవ చేసి దివ్య ధాత్రి ఋణము
దీర్చి మనసు దీర తృప్తిఁచెంది
నావు ఋణవిముక్తి నందినావు
ధన్యజీవివైతి మాన్య చరిత! 77

గీ. తాతల వలన నుండి నీ తరము దాక
తరుగనట్టి సుగుణ సంపద నిడి దీర్చి
దేశసేవకు సంతతిన్ స్థిరత నిల్పు
ఘనత మీదె వాస్తవముగ కాంచినంత 78

గీ. నీదు పెంపక మెట్టిదో శోధనంబు
సేయ నీకు వారసునిగ చేసినావు
నీదు నాశయసిద్ధిని నినుమడింపఁ
నీదు పెద్ద కుమారుని నిర్మలాత్మ! 79

కం. మండలి సంస్థను నిలిపెను
మండలి యాశయము దీర్ప మానితముగనే
దండిగ దేశపు సేవకు
"మండలి బుద్ధప్రసాదు" క్ష్మాతలముననే 80

ఆ.వె. ఎన్న దగిన గుణము లన్ని మెండుగ నుండె
కన్న సంతు నందు ఘనము గానె
కన్న వారి పెంపకము పట్టి చూడఁగ
మిన్న గానె తోచు కన్ను గవకు 81

కం. సంతత్యుత్సాహము గదె
సంతతి జనియించునప్డు సంభవమగునే
సంతతి గుణవృద్ధివలన
వింతగ తలిదండ్రులకగు విశ్వము పొగడన్ 82

గీ. కన్నవారలు, నిను గట్టు కొన్నవారు,
కన్నబిడ్డలు, వంశంబు, కన్న ఊరు,
ఉన్న దేశంబు, గురువులు, మిన్న కీర్తి
ధరులు నీ వల్ల నందఱు ధన్యులైరి 83

కం. మధురోక్తులు, ఋజు నడలును
మధురపు లక్ష్యంబు లెల్ల, మధుర గుణంబుల్
మధురస్మృతిపుంజమ్ములు
మధురామృత ఝరి గ్రహణము మధురము గాదే 84

గీ. ఆగ్రహానుగ్రహ సమగ్ర నిగ్రహంపు
విగ్రహంబు దూరమయిన విలువలన్ని
చేయు సేవలు శేషించు స్మృతులు నమిత
మధుర సంస్మృతి కావ్యమై మహిని వెలసె 85

కం. పుట్టిన దినమ్ము నందున
పుట్టెడు మధుర స్మృతులపు పుంజము లెల్లన్
అట్టిటు కుదిపెను మది కని
కట్టును కట్టిన కరణిని కాలవశమునన్ 86

గీ. దేశనాయకుల జయంతి దినములన్ని
సౌరమాన ప్రకారాన జరుగుచుండె
'హూణ సంస్కృతి' రీతిగా నుర్వి బరగు
చాంద్రమానంబు రీతిగా జరిగె మున్ను 87

గీ. అటుల నాల్గవ తేదీన అర్కమాస
రీతి నాగస్టు మాసాన ప్రీతి గానె
జరుగు మండలి వారికి సాంప్రదాయ
కమ్ముగ కుటుంబ సభ్యులాకాంక్షదీర 88

గీ. వారి లక్ష్యాల దృష్ట్యా శోభస్కరముగ
బంధు మిత్రాభిమానుల భావ సరణి
జ్ఞాపకార్థమై పుత్రులుత్సాహమునవె
అవనిగెడ్డను జరుగు జయంతి దినము 89

కం. వేడుకతో ప్రతి వర్షము
వాడుకగానే జయంతి పండుగ వోలెన్
తోడుగ మండలి సభ్యులు
కూడి సలుపుదురు జనకుని కోరికతీరన్ 90

కం. జనకునకు తగిన తనయుడు
అనుసరణీయుండునగుచు నాదరమునవే
అనుగుణవర్తనమునవే
తన ధర్మము జ్యేష్ఠుండు సతతంబునెఅపున్ 91

కం. అభిమానమున ధర తెలుగు
సభకుజనగనొల్లకతన జనకుడు నుండన్
సబవుగ ప్రసాదు నందటి
అభిమతమున నేయటజనెనాఖరి క్షణమున్ 92

గీ. రాజకీయ వారసుండయు, రాజితుండయి
ప్రజలకు నితోధికమ్ముగ పాలనంబు
సలిపెను పశు సంవర్ధక శాఖ మంత్రి
గానె కొనసాగెనే కొంతకాల మితడు 93

గీ. తండ్రిని మురిపించునను గు తనయునిగనె
గురువునే మించు శిష్యుండై ధర బరంగి
చండమార్తాండుడౌచు స్వశక్తియుక్తుం
డగుచు ముద్రవైచె ప్రజల యాత్మలందు 94

కం. ఉత్సవ వేళ కుటుంబము
ప్రోత్సాహకరంబుగానె పుష్కళము గనే
ఉత్సాహ పూరితముగనె
వత్సరముగప్రకటితంబు బహుమతులెల్లన్ 95

కం. ఎవ్వరికైనను పొడమునె
ఇవ్విధ మైనట్టి భావమించుక యేనిన్
ఇవ్వసుధాతలమందున
దివ్వెలుగై సంస్థ నిల్చె తృప్తికరముగన్ 96

కం. దీని విలువ కొలువగ కొల
మానము నెయ్యదియు లేదు క్ష్మాతల మందున్
మానవతయు నభిమానము
మానముగానెఱుగవలె సమతకునిలయమౌ 97

కం. ఎందఱొ మహనీయులకే
ఇందున లబ్ధియు ఘటిల్లె తృప్తిన్జెందన్
ఇందున నందున పెద్దలు
అందఱు మోదంబు నొంద నాత్మీయతతోన్ 98

గీ. ముందు చూపుతో వైచెను ముంద డుగును
పెద్ద తనయుడు పితృతృప్తి వృద్ధి కొఱకు
చిత్తశుద్ధిమై చిత్ర విచిత్ర గతిని
శ్రేష్ఠ తరముగ కులము తరింప గానె 99

ఉ. వేంకట కృష్ణరాహ్వయ! వివేకి! విశుద్ధ చరిత్ర! శ్రేష్ఠుడా!
అంకిత భావ భావక! మహాత్ముడ! విశ్వహితైషి! రో సదా
సంకట వారకా! సుకృతి! సాహసవంతుడ! ప్రేమపాత్ర! ప
ల్వంకల గాంచినా! సుతుల బట్టియె! ధన్యత గాంచె వంశమున్ 100

ఉ. పావన మాయె నీకులము; భవ్య గుణాఢ్య! వినీతి విత్తమా!
పావక తేజమా! ఘనుడ! ప్రాభవ! "బ్రహ్మకపాల" గోత్రజా!
ధీవినుతప్రభావ సుమతీ! మితమంజుల వాగ్విలాస శో
భా విభవా! ఉదారమతి! భావము నందుననిల్చి యుంటివే 101

సీ. కనులకు కాయము కనరాక పోయినా
కాలగర్భమ్మున కలసి పోని
గోచర నీయంబు గుహ లోచనములకు
స్మరణ మాత్రాన సుస్పష్టముగనె
జగమున సలిపిన సత్కర్మ చయమంత
సర్వంబు నిల్చును శాశ్వతముగ
మిళితమౌ శేష సస్మృతిజాతంబులు
స్వాంతమ్మునందు లెస్సగనె దోచు

గీ. గతము మరపు గొలుపు నొక్క కడవఱకును
జీవితాంతంబు పితృదేవు చింతనంబు
తరణకరణీయమౌను సంతానమునకు
వివిధ రీతులు గానెల్ల వేళలందు 102

ఉ. అన్నకు తోడుగా నిలిచి యంచిత భక్తి నిసేవసేయుచున్
తిన్నని వర్తనంబుననె తీరుచు కూరిమి పేర్మితోడ, పే
రెన్నికకన్న వాడగుచు ప్రీతిని తోడ కృషీవలుండనై
చెన్నగు లక్ష్మణుండు వలె శ్రేష్ఠుఁడు నా యెను సోదరుండహో 103

ఉ. తామర తంపలై తనరె తత్కుల మంతయు వర్ధమానమై
ధీమణి తండ్రిగారి ఘనతేజము నల్దిశలందు నిల్పుచున్
సామము తోడ మెల్గుదురు సర్వ విధాల ప్రశస్త మూర్తులై
ఏమి విభేద మించుకయు నేర్పడ కుండగ బుద్ధిమంతులై 104

కం. మండలి కుటుంబ సభ్యులు
గండర గండలు జనులకు గౌరవ నీయుల్
నిండు ప్రజాసేవకులై
దండిగ నిలుతురు నిడుములు తఱుమగ ధృతిచేన్ 107

ఉ. మండలి వారలి వ్విధము మామది౦దోచుచు వెల్గుచుండగా
వెండియు తం(డిపుట్టు దిన వేడుక సందడి సాగువేళలో
గుండెయ నిండ నిండుకొను కోమల భావము ఖండకావ్యమై
దండిగ దండగా నిలచి దర్శన మిచ్చెను మోక్షసిద్ధికై 106

కం. ఇదినాబుద్ధికి తోచిన
విధంబుగా (వ్రాసినాడ విశదంబుగనే
సదమల వృత్తిని ఘనముగ
ముదమున (ప్రియముగ తనియగ పొల్పుగ నిటులన్ 107

గీ. వంశగో(త్రాభి వృద్ధియు స్వస్తిరస్తు
సర్వవాంఛాఫల(ప్రాప్తి శాంతిరస్తు
భాగ్య వర్ధన మస్తు కై వల్యమస్తు
విశ్వ మంగళ(ప్రదమస్తు విజయమస్తు 108

# గద్యము

ఇది (శ్రీమద్వేంకటేశ్వర దివ్య చరణ కమల సంసేవా పరాయణోల్లసిత పరిపూరిత మరంద పానానంద కందళిత హృన్మందిర కృపా కటాక్ష వర(ప్రసాద లబ్ధ సిద్ధ విద్యా (ప్రభావ వికీర్ణ కవితా (ప్రవీణ హరితస గో(త్ర సంభవ, పరమ పవి(త్ర తేజోమూర్తులాన్వయయశః పారావార చం(ద్ర రామ యాహ్వాయ (ప్రపౌ(త్ర, గవరాఖ్య పౌ(త్ర, యజుస్మార్త వాస్తు జ్యోతిష ముహూర్త సిద్ధాంత గణిత పారీణ స్వర్ణ ఘంటా కంకణ సన్మానిత పుణ్య శ్లోక రామ గోవిందార్య లక్ష్మీ నరసమాంబా జ్యేష్ఠపు(త్ర సుకవి విధేయ ఆనందకుమారీ కళ(త్ర సమేత శతాధిక (గ్రంథకర్త కవి వాచస్పతి బిరుదాంకిత దైవజ్ఞ (బహ్మ(శ్రీ తేజోమూర్తుల వేంకటేశ్వరరావు నామధేయ (ప్రణీతంబైన ఇం(ద్రధనుస్సు ఖండకావ్యము సంపూర్ణము.

సర్వే జనాః సుఖినో భవంతు
మంగళం మహత్
(శ్రీ (శ్రీ (శ్రీ (శ్రీ (శ్రీ

# మండలి వారి వంశవృక్షము



## తేజోమూర్తుల వారి వంశ వృక్షము (గోత్రము : హారితస)

ప్రవర : అంగీరస, అంబరీష, యౌవనాశ్వ

మూల పురుషుడు

↓

పెద్ద అప్పన్న —— చిన్న అప్పన్న

↓

పేరయ్య

↓

వెంకట రామయ్య

↓

పేరయ్య (గవరమ్మ)

↓

రామయ్య (అచ్చమ్మ)

↓

గవర్రాజు (లక్ష్మణమ్మ) — విశ్వనాథరావు (శేషమ్మ)

గవర్రాజు (లక్ష్మణమ్మ) ↓

1. రామమూర్తి (రాజేశ్వరి)
2. రామగోవిందం (లక్ష్మీనరసమ్మ)
3. సీతారామం
4. పెదకామేశ్వరరావు
5. చిన్నకామేశ్వరరావు
6. సత్యనారాయణ
7. రామమూర్తి (సత్యవతి)
8. సీతారామం (అచ్యుతాంబ)

2. రామగోవిందం (లక్ష్మీనరసమ్మ) ↓

1. వేంకటేశ్వర రావు (ఆనందకుమారి)
2. గవర్రాజు (దత్తుడు) సూర్యలక్ష్మి
3. గవర్రాజు (పద్మావతి) → రామశ్రీ
4. అచ్యుత రామయ్య
5. రామకృష్ణ (విశాలాక్షి) → గోపి
6. వెంకట్రావు (రాజేశ్వరి) → మంజునాథశర్మ
7. సత్యనారాయణ

1. వేంకటేశ్వర రావు (ఆనందకుమారి) ↓

1. రామగోవిందం —— 2. రామగోవిందం (వేంకట శ్రీరామలక్ష్మి) —— 3. సుబ్రమణ్యం —— 4. వేంకట సత్య సుబ్రమణ్య శర్మ (లలిత)

2. రామగోవిందం (వేంకట శ్రీరామలక్ష్మి) ↓

1. వేంకట మోహన వాణి కార్తికేయ
2. శ్రీసాయి శ్రీవత్స

4. వేంకట సత్య సుబ్రమణ్య శర్మ (లలిత) ↓

1. శౌర్య శ్రుత కీర్తి
2. శ్రీకర సాహు



తండ్రి: వెంకట్రామయ్య, తల్లి: మహంకాళమ్మ,

మామ : భోగాది వెంకట్రామయ్య, అత్త: వెంకటసుబ్బమ్మలతో

మండలి వెంకట కృష్ణారావు, ప్రభావతి దేవి, బుద్ధ ప్రసాద్,

అన్నపూర్ణ, సత్యప్రసాద్, రేవతి



ప్రపంచ తెలుగు మహాసభలు విజయవంతంగా నిర్వహించినందుకు శ్రీ మండలిని అభినందిస్తున్న
రాష్ట్రపతి శ్రీ ఫకృద్దీన్ ఆలీ అహ్మద్, ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు గార్లు.


ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూతో మండలి వెంకట కృష్ణారావు


రాష్ట్రపతి శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణ గారితో...


మదర్ థెరీసాతో...

# కృతికర్త పరిచయము

## శతాధిక గ్రంథకర్త

# శ్రీ తేజోమూర్తుల వేంకటేశ్వరరావు

**విశ్రాంత ఆంధ్ర పండితుడు, పాయకరావుపేట, విశాఖ జిల్లా.**

## శ్రీ వేంకటసత్యగాయత్రీ జ్యోతిషాలయము మరియు
## శ్రీ వేంకట సత్య గాయత్రీ విద్యాపీఠము వ్యవస్థాపకుడు

**( విద్య, వైజ్ఞానిక, సాహిత్య, ఆధ్యాత్మిక, )**

| | | |
|---|---|---|
| తండ్రి | : | కీ॥శే॥ రామగోవిందం గారు |
| తల్లి | : | లక్ష్మీనర్సమ్మ గారు |
| శాఖ | : | కోసలనాటి బ్రాహ్మణులు |
| గోత్రం | : | హరీతస |
| జననం | : | 24-7-1946 |
| విద్య | : | ఎమ్.ఏ.(తెలుగు), ఎమ్.ఏ.(జ్యోతిష్యం), బి.యిడి. |

**అభిరుచులు : గ్రంథ పఠనం, వాస్తు జ్యోతిష, ముహూర్త, సిద్ధాంత, గణిత,కవితావ్యాసంగము, నాటక కళాభిరుచి ప్రవేశము.**

**ముద్రిత గ్రంథములు** : 1. శ్రీ సత్యదేవ మహిమ, 2. శ్రీ వేంకటేశ్వర సుప్రభాత శతకమాల, 3. శ్రీ కుమార సుప్రభాతం, 4. శ్రీ కనక దుర్గా సుప్రభాతము, 5. శ్రీ ఓరుగుంటలమ్మ వైభవము, 6. ఆంధ్ర వ్యాకరణ చంద్రిక, 7. శ్రీరాజగోపాలసుప్రభాత శతకమాల, 8. గౌతమీ పుష్కరవైభవము 9. శ్రీపాండురంగసుప్రభాతశతకమాల,10. శ్రీ ఉమాధర్మ లింగేశ్వరస్వామి వైభవము, 11. శ్రీ గురు సంస్తవరాజము 12. శ్రీ జగద్గురు ఆదిశంకరచార్య కవితా సుధాలహరి, 13. కృష్ణాపుష్కర వైభవము. 14. సూక్తమంజరి.



బ్రహ్మశ్రీ తేజోమూర్తుల వేంకటేశ్వరరావు



మండలి వెంకట కృష్ణారావు, శ్రీమతి ప్రభావతీ దేవి